# మద్యపాన నిరోధముకు కొన్ని సూచనలు

మహమోలాబాయి

అనేక మహాపురుషులనుగన్న మన భరత మాత మద్యనిషేధనయందును ముందంజవేసి ప్రపంచమున కాదర్శనియగుట గొప్పవిశేషము. విలోపావారసహిత మీవిషయమున భారతీయుల శ్లాఘించుచున్నారు. భారతదేశమందలి కొక రెండు చిన్న సంస్థానము లలోను, మద్రాసు మరియు మధ్యరాష్ట్రములోను మద్యము పూర్తిగా నిషేధింపబడినది.

మనహైదరాబాదు రాజ్యములో మద్యపాన నిరోధకసంఘమువారు మార్చి 2 బుధవార మురోజు, మద్యపాననిరోధక దినము జరిపినారు. ఆరోజు ఊరేగింపులు, సభలు ప్రతి తాలూకాలోని గ్రామములలో నిషేధప్రచార ప్రకటనలు బర్గపి తహసీల్దారు పటేలు పట్వారీలకు అజ్ఞలొసగినట్లు తెలియుచున్నది.

మద్యనిరోధకము ప్రేమపూర్వకము బోధలతో సల్పుమని వ్రాయబడినది, గుత్తేదార్లకునష్టము కలుగును. అనష్టము నిరోధకసంఘముగాని. ప్రభుత్వముగాని, భరించుటకు సిద్ధపడినచో సంఘోద్దేశము బహుసులభముగా నెరవేరుటకు మార్గమేర్పడును.

నగరవాసులకును, గ్రామవాసులకును అనేక విషయములలో భేదముండుట యెల్లరకు తెలిసినదే. కాబట్టి నిరోధకదినము క్రింది విధముగా ప్రచారము జరిగిన మూఢజనులకు మద్యముయొక్క చెడుగులు సుబోధకములగునని నా యుద్దేశ్యము.

1. గ్రామజనులు సాయంత్రమువరకు తమ పొలములందుండెదరు. కావున ప్రచారము సాయంత్రము 7గంటలతరువాత జరుపుటమంచిది.

2. ప్రచారము గ్రామమందలి కల్లుదుకాణముకద్ద లేకదానిసమీపమునజరుగుట మంచిది.

3. ఉగాది పండుగనాడు మద్యముయొక్క చెడుగులను చెప్పుచు, ఊరేగింపుజరుపవలెను.

4. ఊరేగింపులో గ్రామమందలి గౌరవనీయు లందరును పాల్గొనుట మంచిది.

5. ఊరేగింపులో బాజాబజంత్రులు డప్పులు మొదలగునవియుగాక తగినంత వెలుతురుండుట రమ్యము.

6. లొట్లు, ముంతలు, సురుగులు, సీసాలు గ్లాసులు గంజాయిచిలుములు (చొంగలు) వీని నొకొక్కదాని నొకొక్క పొడుగాటి కఱ్ఱెకుదగిలించి అందరికి గానవచ్చునట్లు పైకెత్తిపట్టుటమంచిది. ఈపని విద్యార్థులే కాక ఇంకెవరుచేసిన తప్పులేదు. ఈ ప్రదర్శనము మూఢజనుల కొకవిధమగు సుబోధకము.

7. ఆర్థికముస్థితికి, త్రాగుడుకుగల సంబంధము గ్రామ్యభాషలోనే బోధించవలయును.

8. త్రాగుటకలవాటుగలవారు త్రాగుడువలని నష్టములు నిరాటంకముగా తెలుపుచు ఇకముందు తాము త్రాగమని వాగ్దానము చేసి తరువాత నితరులతో వాగ్దానములు గొనుటంతో శ్రేయస్కరము.

9. గ్రామమందలి మాల, మాదిగ, చాకలి మంగలి, తెలగ, మున్నూరు బెస్త, బోయ, సాలె, జాంగ్రు. కాపు, కురక మొదలగు సమస్తజాతివాండ్లపెద్దలతో (చౌద్రీలు) ముచ్చటించి, త్రాగుడునష్టముల దెలిపి ఇకముందు శ్రాద్ధము లప్పుడు, శుభకార్యములందు మత్తుపదార్థములు వాడగూడదని ప్రత్యేకముగా బోధించి సభలో వారలచే వాగ్దానముగొనవలెను.

10. దేశముఖులు, దేశపాండ్యాలు, గ్రామాధికారులు తమతమ అధికారబలమును ఇతర సమయములందు ప్రజలపై ప్రయోగించినట్లు ఇట్టి సుసమయమునగూడ తమశక్తిని ఉపయోగింతురని నమ్మెద.



# పంజాబీస్త్రీల దౌర్బల్య కారణములు

పర్దా ఆచారము, భర్తలుకొట్టుటయని ఒక సభ్యురాలనుట

పర్దాయున్నను తన కెక్కువ బలమున్నదని ఇంకొక సభ్యురాలనుట

పంజాబు శాసనసభలో చర్చ

లాహోరు (మెయిలు)

పంజాబీ స్త్రీల దౌర్బల్యమునకు మొదటి కారణము పర్దా, రెండవకారణము భర్తలుకొట్టుట యని మునిచందుగారి సతి ప్రజారోగ్యశాఖా వ్యయమునకై కోరబడిన మొత్తములో కోత ప్రతిపాదనముగూర్చి ఉపన్యసించుచు చెప్పెను.

మునిచందు సతిగారి ప్రక్కన కూర్చుండియున్న చౌదరి కృష్ణగోపాల దత్తుగారు లేచి ఉపన్యాసకురాలిభర్త ఆమెను ఎప్పుడుగాని కొట్టియుండలేదని చెప్పుటకు ఆయన నా కధికార మిచ్చియున్నాడు అని చెప్పగా అందరును నవ్విరి.

తనను తనభర్త ఎన్నడును కొట్టియుండలేదని మునిచందుగారి సతి యనగా మరల అందరును నవ్విరి.

కొంతచర్చ తర్వాత బేగంరషీదాలతీఫ్ గారు తాను జీవితకాలమంతయు పర్దా ఉపయోగించియున్నను లాహోరులో తనకంటె ఎక్కువబలముగల స్త్రీ ఎవ్వరును లేరనిరి.

ప్రతికూలపక్ష సభ్యులు ప్రజారోగ్య శాఖావ్యయములో ఎక్కువభాగము. ఉద్యోగుల జీతములక్రిందనే సరిపోయెననిరి.

ప్రభుత్వపక్షమున బేగంషా నవాజ్ గారు ఉపన్యసించుచు ప్రజారోగ్యము పూర్వముకంటె చాల వృద్ధిజెంది యున్నదనిరి.

## ఖైదీలసంఖ్య తగ్గుచున్నది

బెంగాలు అసెంబ్లీలో హోంమంత్రిగారి ప్రకటన

కలకత్తా: మార్చి ౨౩.

పోయిన నవంబరు నెలలో ౧౧౦౦ డిటెన్యూలు వదలబడినతర్వాత ఇపుడు ౫౦ మంది డిటెన్యూలు కొన్నిషరతులపైన వదలబడినారు— అని హోంమంత్రి సర్ నాజిముద్దీన్ గారు నేడు బెంగాలు శాసనసభలో ఒకప్రశ్నకు సమాధానముగ తెలిపిరి. ఇంకను డిటెన్యూను క్యాంపులలోను, జెయిల్లలోను నున్నవారి సంఖ్య తగ్గుచున్నదనియు, ౧౫ మార్చినాడు ౨౯౯ మంది ఉండిరనియు, వారలు కలకత్తాలో నుండిరనియు, వారలను వదలుటవల్ల ప్రజాశాంతికి భంగము లేదనిపించిన వెంటనే వారలను వదలిపెట్టబడుదురనియు హోంమంత్రిగారు చెప్పిరి. ఇంకొకప్రశ్నకు సమాధానమొసంగుచు వాజిముద్దీను గారు మూడవ రెగులేషనుననుసరించి ఖైదీలుగ నుంచబడినవారలు ౧౪ మంది గలరనియు, వారలు నట్లుండుటకు ఇంతకనీస కాలమని, ఇంత ఎక్కువకాలమనిగాని నిర్ణయించ బడియుండలేదనియు చెప్పిరి. కాని వారలలో కొందరు ౨౦ ఏండ్లకంటె ఎక్కువ కాలముగా జైల్లలో నున్నారనిరి.

## రైళ్లరాకపోకలు

H. E. H. ది నైజామ్స్ స్టేటురైల్వే

(పెద్దలైను)

### చేరుట

| | సికింద్రాబాదు, (బి.జి.) గం.ని. | హైద్రాబాదు. గం.ని. |
|---|---|---|
| నం. 11 ఖాజీపేట–హైద్రాబాద బి.జి. ప్యాసింజరు (బి) | 6-26... | 7-1 |
| నం. 2 వాడీ–బెజవాడ ప్యాసింజరు | 7 52... | 8-26 |
| నం. 1 బెజవాడ హైద్రాబాద ప్యాసింజరు (ఎ) | 15-0... | 15-41 |
| నం. 10 బ్లైర్ విజయనాథ్–సికింద్రాబాద ప్యాసింజరు | 20-30... | 2 -1 |

### వెళ్లుట

| | | |
|---|---|---|
| నం. 9 సికింద్రాబాద–బ్లైర్ విజయనాథ్ ప్యాసింజరు | 7-20... | 7-56 |
| నం 2 వాడీ–బెజవాడ ప్యాసింజరు | 8-46... | 8--9 |
| నం. 12 హైద్రాబాద బి.జి–ఖాజీపేట ప్యాసింజరు. (బి) | 19-45... | 19-4 |
| నం. 1 సికింద్రాబాద–వాడీ ప్యాసింజరు. (బి) | 17-20... | 17-55 |

(చిన్నలైను)

### చేరుట

| | సికింద్రాబాదు, (ఎ.జి.) గం.ని | హైద్రాబాదు గం.ని. |
|---|---|---|
| నం, 31 మన్మాడ్–హైద్రాబాద యం.జి. ప్యాసింజరు | 6-50... | 7-34 |
| నం. 35 ద్రోణాచలం–సికింద్రాబాద–ప్యాసింజరు | 18-50... | 18-18 |
| నం. 33 మన్మాడ్–హైద్రాబాద ఎం.జి. ప్యాసింజరు | 20-41... | 21-10 |
| నం. 27 ద్రోణాచలం సికింద్రాబాదు ప్యాసింజరు | 6- 0.. | 6-25 |

### వెళ్లుట

| | | |
|---|---|---|
| నం. 34 హైద్రాబాద ఎం.జి. మన్మాడ్ ప్యాసింజరు | 7-33... | 6-50 |
| నం. 36 సికింద్రాబాద–ద్రోణాచలం ప్యాసింజరు | 7-0... | 7-24 |
| నం. 32 హైద్రాబాద–యం.జి. మన్మాడ్ ప్యాసింజరు | 20-0... | 19-6 |
| నం. 8 సికింద్రాబాదు ద్రోణాచలం ప్యాసింజరు | 22-0... | 22-20 |

### నోటు:—

(ఎ) హైద్రాబాద బి.జి. చేరిన పిదప సికింద్రాబాదవెళ్లును. తిరిగి సికింద్రాబాద నుండి 17-20 గంటలకు వాడీకి బయలుదేరును.

(బి) ఈబండ్లు ఖాజీపేటలో ఢిల్లీ,మద్రాసు మధ్యవచ్చు, వెళ్లు గ్రాండుట్రంక్ యెక్స్ప్రెస్ బండ్లలో, వార్ధా బెజవాడమధ్యగల మిక్సెడ్ బండ్లతో కలుపును.

---

ఉగాది కోరిక

నన్నగిలి నట్టి యాంధ్రభాషా ప్రసక్తి
అల్ప మైనట్టి దేశ సేవానురక్తి
హైన్యతను గన్న యాత్మీయ క్షాత్రశక్తి
జృంభితంబుగ బహుధాన్య! చేయవలదె?

— సురవరము ప్రతాపరెడ్డి.

---



# గోలకొండపత్రిక

ఈశ్వర నామ సం॥ర పాల్గుణ బ॥ ౧౫

గురువారము



## ఉస్మానియా విద్యాపీఠ నివేదిక

## ౧౩౪౪ ఫ.

౨

నివేదన సంవత్సరాంతమున విశ్వవిద్యా పీఠపు అన్ని కళాశాలలలోను, అన్ని ఫ్యాకల్టీలలోను కలసి ౧౩౭౯ మంది విద్యార్థులుండిరి. ఈ సంఖ్య పూర్వ సంవత్సరపు సంఖ్యపై ౧౦౦ ఎక్కువ. ఈ ఎక్కువయంతయు సైన్సు తరగతులలో, ముఖ్యముగ జీవశాస్త్రపు తరగతులలో విద్యార్థులెక్కువయగుటచేతనేయని తెలిసికొనగల్గుట చాల సంతోష కారణము. ఇట్లు సైన్సు తరగతులలో విద్యార్థులసంఖ్య ఎక్కువగుటచే సైన్సుశాఖలను విస్తరింపజేయుట యెంతో అవసరమని ప్రతి సైన్సుశాఖాధికారియు, ముఖ్యముగా వృక్షశాస్త్ర జంతుశాస్త్ర శాఖాధికారులు కొన్నిఏర్పాట్లను కోరియున్నారు. క్రొత్తగా నీ సంవత్సరమందే జంతుశాస్త్రశాఖకు ఒకప్రొఫెసరును, ఒక లెక్చరరును, వృక్షశాస్త్ర శాఖలో రీడరు పదవి తీసివేసి, ఒక ప్రొఫెసరును, భౌతిక రసాయన శాస్త్రములకు చెరియొక లెక్చరరును క్రొత్తగానియోగించబడిరి. వీరలేగాక సీనియరు జూనియరు డెమాన్స్ట్రేటర్లుగూడ నియోగించ బడిరి. ఇంతేగాక సైన్సు ఉపకరణములకు కావలసిన ఖర్చులకై కూడ క్రొత్తమొత్తములు ఒసగబడుట మూలమున సైన్సు శాఖ బలపరచ బడినది. ఇప్పటికనివిద్యార్థులు హెచ్చుటచేఏర్పాటు చేయబడినదానికి ఖర్చుఎక్కువచేయవలసివచ్చుచున్నదని భౌతికరసాయనశాస్త్రశాఖల అధిపతులు చెప్పుచున్నారు మొత్తముమీద నిట్లు సైన్సుశాఖలు విస్తరించుచుండుట అపేక్షణీయము.

థియాలజీ ఫ్యాకల్టీలో ౨౬ మందియు, ఆర్ట్సు ఫ్యాకల్టీలో ౧౧౧౪మందియు, సైన్సుఫ్యాకల్టీలలో ౧౨౧ మందియు, లా ఫ్యాకల్టీలో ౭౨ మందియు, యంజనీరింగు ఫ్యాకల్టీ లో ౪౭ మందియు, విద్యాబోధనపు ఫ్యాకల్టీలో ౧౪ మందియు, వైద్యపుఫ్యాకల్టీలో ౧౫౫ మందియు ఉండిరి. సంవత్సరాంతమున మెట్రిక్యులేషను పరీక్షలో ౧౫౯౭ మందికి గాను ౩౭౯ మందియు, ఇంటర్మీడియేటు పరీక్షలో ౪౬౦ మందికిగాను ౧౩౫ మందియు, బి. ఏ. పరీక్షలో ౧౦౬ మందికిగాను ౫౪ మందియు, బి. యస్సి.పరీక్షలో ౫౧ మందికి ౧౪ మందియు, యం. ఏ. మరియు, యం. యస్సి. మొదటి పరీక్షలో ౨౩ మందికి గాను ౧౫ మందియు, యం. ఏ. మరియు యం. యస్సి. తుది పరీక్షలలో ౧౧ మందికి ౧౧ మందియు, యల్ యల్. బి. మొదటి పరీక్షలో ౩౪ మందికి ౧౮ మందియు, "డిప్లొమాఇన్ యెడ్యుకేషన్" పరీక్షలో ౧౨ మందికి ౧౧ మందియు, యంజనీరింగు మొదటి భాగము పరీక్షలో ౩౮ మందికి ౬ మందియు, రెండవభాగము పరీక్షలో ౧౩ మందికి ౫ గురును, యం. బి. బి. యస్. పరీక్షలో మొదటి దానిలో ౨౪ మందికి ౧౪ మందియు, రెండవ దానిలో ౧౪ మందికి ౧౧ మందియు, మూడవ దానిలో ౧౧ మందికి ౧౧ మందియు, నాల్గవదానిలో ౯ మందికి ముగ్గురును ఉత్తీర్ణులైరి.

థియాలజీలో రెండు యం. ఏ. డిగ్రీలును, ౪. బి. ఏ. డిగ్రీలును, ఆర్ట్సులో ౪ యం ఏ. డిగ్రీలును, ౫౪ బి. ఏ. డిగ్రీలును,౧.యం,యస్సి. డిగ్రీయు, ౯ బి. యస్సి. డిగ్రీలును, ౧౩ యల్.యల్. బి. డిగ్రీలును, ౭ యం. బి. బి. యస్. డిగ్రీలును, ౧ బి. ఇ. డిగ్రీలును, ౬ యద్యుకేషన్ డిప్లొమాలును ఇట్లు ౧౦౯ డిగ్రీలొసగ బడెను. బి.ఏ పరీక్షకు ఇరువురు స్త్రీలువచ్చి ఇరువురును ఉత్తీర్ణులైరి.

మహారాష్ట్రమందును, సంస్కృతమందును విద్యార్థులసంఖ్య హెచ్చుచుండుటచే యం. ఏ. తరగతులను పెట్టుటకుకూడ అవకాశము గలుగుచుండగా, తెలుగులో విద్యార్థులసంఖ్య ఇన్నాళ్ళతరువాత కూడ "తక్కువగానే యున్న"దని చెప్పుకొనవలసి వచ్చుట విచార కరముగ నున్నది. రాష్ట్రములో జనసంఖ్యలో మహారాష్ట్రులకంటె తెలుగువారు ఎక్కువ యున్నపుడు విద్యాపీఠమందిట్టి స్థితి ఆంధ్ర భాషాభిమానులకు విచారకరమే యగును. దీనికి కారణము లేమో విచారించి కనుగొని పరిస్థితులను చక్కబెట్టవలసి యున్నది. ఒకవేళ తెలుగు విద్యార్థులు విశేషముగ నైజాంకాలేజిని ఆశ్రయించు చున్నారేమో! ఇదియు విచారించ దగిన విషయము—

స్త్రీల కళాశాలలో రూ. ౪౪౫౧౭-౦ ౧౦ల ఖర్చుతో 33 మంది బాలికలకు విద్య నేర్పబడినది. ఇంతఖర్చు ఎవరికిగాని ఆశ్చర్యము కలిగించగలదు. ఇట్టిఖర్చులతో కళాశాలను నడుపవలసి వచ్చునో బ్రిటిషు ఇండియా వారలు మొదటనే ఆ ప్రయత్నము మానుకొందురు.

తర్జుమా శాఖలో రూ. ౧౫౯౭౦ ౧౦- ౯- ౯ ఉవ్యయముతో ౧౪ క్రొత్త పుస్తకముల తర్జుమా పూర్తిచేయబడెను. ౪౩ పుస్తకముల తర్జుమా జరుగుచుండెను, ౬ తర్జుమా చేయబడిన పుస్తకములు ప్రకటించ బడెను, ౧౧ పుస్తకములు అచ్చగుచుండెను,

మొత్తముమీద నివేదిక ప్రోవైస్ ఛాన్సెలరు అగు డాక్టరు మెకంజీగారి మ్యుదకు ప్రకటించు చున్నది. వారింకను ఎన్ని సంస్కరణములను తలపెట్టిరో! కాని కాలగతి ఈ లోపలనే వారిని మనమధ్యనుండి తొలగించినది. ఏదియెట్లున్ననుముందుగా మన విద్యాపీఠమునకుప్రపంచఖ్యాతివడసినట్టియు, భారత దేశమందు ఇప్పటికినిలేనిఉన్నతవిద్యకు స్థానములని ప్రసిద్ధి గాంచినట్టియు, ఆంగ్లదేశపు విశ్వ విద్యాలయములలో కొన్నింటి యొక్క ఆమోదముచు సంపాదించి పోయినందుకు మన విద్యాపీఠము మెకంజీగారి సేవను జ్ఞాపకముంచుకొన వచ్చును.

---

## శ్రీమత్ బహుధాన్యనామ సంవత్సర

## ఫలితాంశములు

ప్రజలకు యీతిఅగ్ని బాధలు, దొంగలభయము, రాజులు యుద్ధసన్నాహములు.
ప్రజానుకూల శాసనములు! ధాన్యములకు ధరలుతగ్గుట, పశుపీడ,
ఇవి బహుధాన్య ఫలములు!



### దైవజ్ఞ బ్రో. వేంకట రాజేశ్వరశర్మ

(శ్రీ నిజామాంధ్రీయ పంచాంగకార్యాలయము, శంకరంపేట, మెదకుజిల్లా)



ఈసంవత్సరమున రాజు శుక్రుడు. మంత్రి బుధుడు. సేనాధిపతి మేఘాధిపతి కుజుడు పస్యనీరస ధాన్యాధిపతి శని. అపరసస్యాధిపతి బుధుడు. రసాధిపతి చంద్రుడు. పశ్చాద్ధాన్యాధిపతి గురుడు గాన రాజాది పరిధిపతి గురుడు గాన రాజాది పతిస్థితుల ననుసరించి పరిశీలించగా ప్రజలు రోగపీడితులై నిస్సత్వులై యున్నను, ఆరోగ్యవంతులై దేవతాసమలై భూమియందు ప్రకాశించెదరు. దొంగలు జనులనుపీడింపుచు జయమునొందుదురు. స్త్రీలు కామోద్రేకముగలవారై, పెద్దలను సంతసింపజేయుదురు. మనుష్యులు పాపకర్మలయం దాసక్తిగలవారలగుదురు. దేశమునం దీతి బాధలును, అగ్ని,వాయుభయము. రాజులత్యుత్సాహముతో యుద్ధముచేయుదురు. రాజు ద్రవ్యమును సమకూర్చి విశేషముగా వ్యయపరచురు. రాజులు ప్రజలయడల బొత్తిగ కోపములేనివారలై ప్రజలకనుకూలమైన నవీన శాసనములుగావింతురు. మేఘములువిశేషమైన వాయువుచే బంధింపబడినను, ప్రజలమనోభీష్టములైన వర్షములుకలిగి నదులు, తటాకములు మున్నగు జలాశయములు పరిపూర్ణముగానిండి, భూమినిప్రకాశింపజేయును. భూమిసస్యఫలపుష్ప లతాదులచే శోభిల్లును. ధాన్యము మధ్యమ ప్రకారముగా ఫలించును. జనులు ధనముగలవారలై నిర్భయముతోనుందురు. నల్లనిభూముల యందు తిలలు మినుములు ఉలవలు మున్నగు కృష్ణధాన్యములు ఫలించును. యెర్రనిభూముల యందు కందులు, శెనగలు మొదలగు యెర్రని ధాన్యములుఫలించును. ధాన్యమునకు వెల తగ్గియుండును. నూనె, నెయ్యి, బెల్లము, శర్కర, వెండి బంగారము మున్నగు రసవస్తువులు సమృద్ధిగనున్నను వెలలు గలిగియుండును. కొమ్ములతో రాళ్లతో, యినుముతోజేయబడిన వస్తువులు వెలలు తగ్గును. మ్లేచ్ఛులు వృద్ధిబొందుదురు పశుపాలకస్థాన రక్షకుడు యముడగుటచే పశువులు రోగముచేపీడించి క్షయించును. జ్యేష్ఠశుక్ల దశమిలు కుజవారమువరాత్రి మృగశిరప్రవేశము జ్యేష్ఠ కృష్ణాకుజవారము రాత్రిఆర్ద్రాప్రవేశము. కార్తీక కృష్ణతృతీయనుండి కృష్ణత్రయోదశి పర్యంతము శుక్రమౌఢ్యమయి, కార్తీక శుక్ల౧౫వాడు సంపూర్ణ చంద్రగ్రహణం వానలుగుతూముల వర్షము పంట (౭) ఏడు వీసము అధికముగా ఫలించును. సర్వప్రాణములు సుఖముగలవై యుండుగాత.

### రాజాది నవనాయక ప్రత్యేకఫలములు

౧ రాజఫలం:– ఈసంవత్సరమునకు రాజు శుక్రుడైనందువలన జలాశయములు పరిపూర్ణముగానిండి భూమిని ప్రకాశింపజేయును. జనులు ధనవంతులై భయములేనివారలైయుందురు. పశువులు విశేషముగాపాలనిచ్చునవియైయుండును. భూమియందువిశేషముగా ధాన్యములభింపును.

౨ మంత్రిఫలం:–బుధుడు మంత్రియైనందున రాజులు ద్రవ్యమును వృద్ధిపరచుదురు. గోవులు మిక్కిలిపాలనిచ్చునవి యగును. జనులు రోగములేనివారలైయుందురు. గోధుమలు పెసలు చెరకు భూమియందు చక్కగా ఫలించును. జలసమృద్ధియగును.

౩ సేనాధిపతిఫలం:–కుజుడు సేనాధిపతియగుటచే భూమియందు మిక్కిలి పీడయును, సస్యములునశించును.జనులు విశేషకామసముగలవారలగుదురు. రాజులకు యుద్ధము సంభవించును.

౪. పూర్వసస్యాధిపతిఫలం:–శని పూర్వసస్యాధిపతియగుటచే తిలలు, మినుములు, ఉలవలు మున్నగుధాన్యము నల్లని భూములయందు ఫలించును.

౫ అపరసస్యాధిపతిబుధఫలం:– మధ్యమవృష్టియు, మధ్యమసస్యములు. మేఘములు వాయువుచే పీడింపబడును. మనుష్యులు నిత్యము భయమునొందుచుందురు.

౬ అర్ఘాధిపతి కుజఫలము:–కుజుడు అర్ఘాధిపతి యగుటచే గాలితోగూడిన స్వల్పవర్షము స్వల్పముగా ధాన్యముఫలించుటయును ప్రజలు కొంచెగ ఆరోగ్యముగలవారలగుదురు.

౭ మేఘాధిపతి కుజఫలము:– అధికమైన గాలియును,ప్రబలమైన అగ్నియును ధన,ధాన్య ఫలములు స్వల్పముగా ఫలించును జనులు రోగపీడితులై బలహీనులగుదురు. జలము స్వల్పముగా లభించును.

౮ రసాధిపతి చంద్రఫలము:– బెల్లము, కర్పూర, తేనె, యవలు మున్నగుర సవస్తువులు విశేషముగాఫలించును. గోవులు విశేషముగా పాలనిచ్చునవియైయుండును.

౯ నీరసాధిపతి శనిఫలము:– కొమ్ములతో రాళ్లతో, యినుముతో జేయబడిన పాత్రలు వెల తగ్గియుండును

౧౦ ధాన్యాధిపతి శనిఫలము:– భూమి యందు ధాన్యము లేకపోవడమును రాజులద్రవ్యము విశేషవ్యయమగును. మధ్యమవృష్టియును చోరులకు జయమును రోగములవలన అగ్నివలనజనులకు పీడయుసంభవించును.

౧౧ పశ్చాద్ధాన్యాధిపతి గురుఫలము:–రాజులు ఒకప్పుడైన కోపములేనివారలై యుందురు. దేవేంద్రుడు విశేషముగా వర్షము కురిపించును. బ్రాహ్మణులు విశేషముగా సత్కరింపబడుదురు.

౧౨ పశునాయకఫలము:– పశునాయకపాలరక్షకుడు యముడగుటచే పశువులు స్వల్పక్షీరము నిచ్చునవియగును. మేతదొరకుట దుర్లభమైయుండును. పశువులు నశించుటయును ధరలు తగ్గుటయు కలుగును.

---

## జపానువారి అపజయము

హాంకాంగ్, మార్చి ౨౫

తాయిఖాన్య పోలో నైన్యేతు సమీపమున జపానుసేనల కపజయము కలిగినది. నలుదిక్కుల నుండి ప్రవాహమువలెవచ్చి చీనా సైనికులు తృణీకరించి జపానువారిని చేరుచున్నటుల చీనా యుద్ధాధికారి మార్షల్ షియాంగ కాయిషేకు కార్యాలయమునకు తంతి మూలకముగా తెలుపుచున్నారు.

---

## అలహాబాదులో సాంఘిక క్షోభములు

### కాంగ్రెసుయొక్క అపజయ సూచకములు

గాంధి మహాత్ముని అభిప్రాయము

బొంబాయి మార్చి ౨౬

"కాంగ్రెసు ప్రధానస్థానమగు అలహాబాదులో సాంఘిక క్షోభములును, పోలీసులయొక్కయు సైనికులయొక్కయు సహాయమును రప్పించవలసి వచ్చుటయు—కాంగ్రెసు ఇంకను బ్రిటిషు అధికారస్థానము నాక్రమించుటకు తగినస్థితికి రాలేదని తెలుపుచున్నవి. ఈ సత్యము ఎంత ఇష్టముకానిదైనను దీనిని అంగీకరించుట ఉత్తమము."అని గాంధిమహాత్ముడు అలహాబాదులో ఇటీవల జరిగిన మతకలహములను గూర్చి అభిప్రాయమిచ్చుచు "హరిజన" పత్రికలో వ్రాయుచున్నాడు.

వారింకను ఇట్లు వ్రాసినారు."కాంగ్రెసు, కాంగ్రెసు రిజిష్టరులోగల కోట్ల మందికేకాక భారత దేశమంతటికిని ప్రాతినిధ్యము వహించుచున్నట్లు చెప్పుకొనుచున్నది. అది దానియొక్క వైరముగలవారలకు గూడ, చేతనైనచో దాని నణచివేయు వారలకుగూడ, ప్రాతినిధ్యము వహించవలెను. అట్లు చెప్పుకొనుచున్న దానిప్రకారము ఆచరణ యుండునట్లు చేసిననాటికేగాని మనము బ్రిటిషు ప్రభుత్వమును తొలగించి స్వతంత్రదేశముగా పనిచేయగలవారలమై యుండము.

"ఈ విషయము, మనము బ్రిటిషు పరిపాలనను హింసాచర్యతో తొలగించినను, అహింసాచర్యతో తొలగించినను కూడ, విజమేయగును.

"బహుశా ఈమాటలు ముద్రితములై వెలపడుకాపల, అలహాబాదులోను ఇతరప్రాంతములందును శాంతి స్థాపితమై యుండవచ్చును. కాని అమాత్రానికే కాంగ్రెసు బ్రిటిషు అధికారమును సంపూర్ణముగా తొలగించుటకు సిద్ధముగా నున్న ఒకసంస్థగా నుండదగినదాయను విషయమును గూర్చిన పరిశీలనలో ముందుకు పోజాలము.

"కాంగ్రెసు ఇపుడు అహ్వానించబడినచో, దేశము నంతయు ఒప్పించగలస్థితిలో లేదనిన ఏ కాంగ్రెసువాదిగాని సత్యముగా సంశయించజాలడు. ఒప్పించగల స్థితిలోనే యున్నచో ఆ అహ్వానముకొఱకై అది కనిపెట్టుకొని యుండదు. కాని కాంగ్రెసు వేగముగా అట్టి సంస్థ యగుచున్నదని ప్రతి కాంగ్రెసువాదియు నమ్ముచున్నాడు. ఈ విషయమునకు నిదర్శనముగా హరిపురములో కలిగిన ప్రకాశవంతమైన విజయము పేర్కొనబడగలదు.

అల్లరులు, సమ్మెలు పేర్కొనగల ఇతర విషయములు మనము కొంతసేపు అగి, కాంగ్రెసు నిజముగా, అంతకంతకు ఎక్కువబలము పొందుచున్నదాయని మనలో మనము ప్రశ్నించుకొనునట్లు చేయవలెను. పొందుచున్నదని చెప్పిన దోషము వాదియని నేను ఒప్పుకొనకతప్పదు.అట్లు చెప్పుటలో నేను ఎక్కువ తొందరపడి యుంటినా?

కాంగ్రెసుయొక్క అసాధారణమైన అభివృద్ధికి కారణము, ఎంత అపరిపూర్ణమైనను, అహింసా తత్వముయొక్క అంగీకారా చరణలని నా నమ్మకము. కాంగ్రెసు అవలంబించిన అహింస ఎటువంటిదో విచారించవలసిన సమయమిపుడు వచ్చినది. అది బలహీనుల, నిస్సహాయుల అహింసయా, లేక బలవంతుల శక్తిమంతుల అహింసయా? మొదటిదైనచో దానిచే మనమెన్నటికిని గమ్యస్థానము చేరజాలము. దానిని చిరకాలము అచరించినచో మనము స్వపరిపాలనకు అనర్హులము కూడ కావచ్చును. దుర్బలులును నిస్సహాయులును విధిలేక వారి చేయుపనులలో అహింసకులుగ నుందురు. కాని నిజముగా వారలమనస్సులలో హింసాలోచనలుండును, దానిని ప్రకటించుటకు సమయము కొఱకై వేచియుందురు. కాంగ్రెసులో చేరియున్నవారలు ఒక్కొక్కరును, అందరును కలిసియు తమ అహింసాస్వరూపమును పరీక్షించుకొనవలెను. నిజముగా అది బలమునుండి పుట్టినది కానిచో, కాంగ్రెసువారలు అట్లు ప్రకటించి,తమవర్తనములో అవసరమైన మార్పులు చేసికొనుట ఉత్తమము, గౌరవము.

ఈపాటికి, అనగా అహింసను ౧౭ ఏండ్లు ఆచరణయందుంచిన తర్వాత, కాంగ్రెసు,పోలీసులను సైనికులను అవసరమైన ప్రతి సమయమునకును అడుగకొనగల వేలకొలది మందియేగాక లక్షలకొలదిమంది అహింసా కర్మ్యరులగు వాలంటీరుల దళమును సంపగలిగి యుండవలసినమాట. ఇట్లు శాంతి సంపాదనకై ప్రయత్నము చేయుచు మరణించిన ధైర్యశాలియగు ఒక్క పశుపతినాథ గుప్తమాత్రమేగాక, మనము నూర్లకొలదిమందిని అట్టివారలను తయారుచేయగలిగి యుండవలసినది. అహింసాపరులగు వారలు సాయుధులవలెగాక శాంతి సమయములందును, అల్లరుల సమయములందును కూడ ప్రయోజనకరముగ నుండగలరు. వారలు అల్లరులే జరుగకుండచేయు నిర్మాణ కార్యములందు సంతతము మగ్నులై యుండగలరు. పోట్లాడుచుండు తెగలవారలను ఒకటిగ చేర్చుటకును, శాంతి ప్రచారము సాగించుటకును,ప్రతిస్త్రీతోను, పురుషునితోను, పెద్దవానితోను, చిన్నవానితోను తమకు పరిచయముండునట్లు చేయుపనులను చేయుటకును అవకాశములను వెదకుట వారలవిధియై యున్నది. అట్టిదళము ఎట్టి అవసరమందుగాని ఉపయోగముగ నుండుటకు సంసిద్ధముగ నుండవలెను. గుంపుల పిచ్చికోపమును అణచుటకు, అందుకు తగినంతమంది ప్రాణత్యాగము చేయవలెను కొన్నివందలు,కొన్ని వేలుకూడ కావచ్చును. అట్టి నిష్కళంకమైన ప్రాణత్యాగములు అల్లరులు మరియొకసారి జరుగకుండ చేయగలవు. నిజముగాకూడ కొన్నివందలమంది యువతీయువకులు మనఃపూర్వకముగా గుంపుయొక్క ఆగ్రహమున కాహుతియగుట ఎప్పటికైనను అట్టి ఉద్రేకము నణచుటకు పోలీసుల, సైనికుల ఉపయోగము, ప్రదర్శనములకంటె చౌకదియు, ఎక్కువ ధైర్యపూరితమునునైన పద్ధతి.

"మనకు స్వాతంత్ర్యము వచ్చినతర్వాత అల్లరులు అటువంటివి సంభవించవని ఒక సూచన చేయబడినది. స్వాతంత్ర్య సంపాదనకై చేయుచున్న పోరాటములో మనము అహింసాక్రియా పరిభాషలను సరిగా, తెలిసికొని ఊహించదగిన సందర్భములన్నిటిలోను ఉపయోగించనిచో, ఆసూచన నాకు ఉత్తుతి యనిపించుచున్నది. కాంగ్రెసుమంత్రులు పోలీసులను సైనికులను ఉపయోగించవలసి వచ్చినంతవరకు నా అభిప్రాయములో, మనము అపజయమును అంగీకరించవలసినదే. అమంత్రులు ఇంకొకవిధముగ ప్రవర్తించి యుండలేకపోవుటది దురదృష్టవశమున సంపూర్ణముగ నిజమే. ప్రతి కాంగ్రెసువాదియు, కాంగ్రెసు కార్యకారిణీ సంఘమును, వారలెనే, మనము ఓడితిమని అంగీకరించుచో ఎందుకు ఓడితిమో తమలోతాము ఆలోచించుకొందురు గాక!

# ఉగాది పండుగ

## వేదకాలమున ఆర్యులు, పార్సీలు యీ చైత్ర శు. ౧ రోజున యీ పండుగ జరుపుచుండిరా?

## ఆంధ్రుల ముఖ్య పండుగ

### సురవరము ప్రతాపరెడ్డి

ఉగాది యాంధ్రులకు చాల ముఖ్యమైన పండుగ. దక్షిణ దేశమందంతటను గూడ రెండుమూడు దినములు హెచ్చుతచ్చుగా నీపండుగ చేయబడుచున్నది. దీనినే సంవత్సరాది పండుగని యందురు. ప్రతిసంవత్సరము చైత్రశుక్ల పాడ్యమి దినమున నీపండుగ చేయబడును. ఇదియే అన్ని పండుగలలో మొదటిపండుగ. ఈ దినమున ప్రజలు వారు తమ శిరస్స్నానముచేసి క్రొత్తబట్టలు కట్టుకొందురు. సాయంకాలమున దేవాలయమందుచేరి బ్రాహ్మణాశీర్వాదము నుబొంది ప్రతివాడును తనపేర నాసంవత్సరమందెన్ని సున్నలుండునది విచారించును. బ్రాహ్మణుడు పంచాంగము చూచి యేయేవ్యక్తి కెన్ని సున్నలుండునది చెప్పును. ఎన్ని సున్నలుండిన నన్ని మారులా సంవత్సరమందావ్యక్తి రోగాస్తుడగునని దీని భావము. నిజాము రాష్ట్రమందలి కొన్ని భాగములలో సాయంకాలమందు దూరి బండ్లన్నియు నలంకరింపబడి మంచియెద్దులచే నీడ్పింపబడును. ఉగాది పండుగయొక్క భోజనములలో చాల ముఖ్యమైనది. "ఉగాది పచ్చడి" లేక గొజ్జు. ఈగొజ్జును వేపపూతచేతను లేత మామిడికాయల ముక్కలచేతను క్రొత్త చింతపండు పులుసు క్రొత్త బెల్లము పానకము గసాలు, పప్పులు మున్నగువానిని కలిపి సిద్దము చేయుదురు. అనగా క్రొత్త సంవత్సర ఫల పుష్పములచే నిది సిద్దము చేయబడుచున్నది. ప్రకృతియంతయు నప్పుడే ప్రాత యాకులను దుల్చి క్రొత్త చివురులచేతను ఫల పుష్పములచేతను వికసించుచుండు సమయ మాంధ్రులకు సంవత్సరాది. ఈపండుగ సర్వ వర్ణములవారికిని ముఖ్యమైనట్టిది.

పూర్వము "యుగాది" (యుగ + ఆది) (యకారాది పదము) పండుగను నొక దానిని చేయుచుండినట్లుల భవిష్యోత్తర పురాణోత్తర భాగమందలి కథనమువలన తెలియవచ్చెడి. శ్రీకృష్ణుడు ధర్మరాజుతో నిట్లు చెప్పుచున్నాడు.

కృతయుగము వైశాఖ తృతీయనాడు ప్రారంభమయ్యెను. కార్తిక నవమినాడు త్రేతాయుగ ముద్భవించెను. నభ త్రయోదశినాడు ద్వాపరము వచ్చినది. మాఘ పౌర్ణిమ కలికాలాదియని చెప్పబడుచున్నది. ఈతిథులు యుగాదులని పండితులచే పేర్కొనబడి యున్నది.

శ్లో. యుగాదయశ్చ కథ్యంతే తథైతాః సర్వమూరిభిః.

ఈకాలగు యుగముల + యాది తిథులందు నాయాదేవతలను బూజించి బ్రాహ్మణులకు నానా దానము లియ్యవలెను.

కలియుగము మాఘమాసమందు ప్రారంభమయ్యెనని పైపురాణము చెప్పుచున్నది. మన ఉగాది చైత్రమందు జరుగునట్టిది. కావున పై పురాణము మనకు ప్రమాణముకాదు.

ధర్మసింధు కారుడును నిర్ణయ సింధు కారుడును నీయుగాది పండుగ సంవత్సరారంభపు పండుగయని నిర్ణయించినారు. ధర్మసింధు కారుడు విశేషించి యిట్లు వ్రాయుచున్నాడు.

అత్రశుక్ల ప్రతిపదాది రమాంతే ఏవమాసః
ప్రాయేణ దాక్షిణాత్యై రాద్రియతే.

అనగా నీపండుగ దాక్షిణాత్యులచే నాదరింపబడుచున్నదని వీరి యభిప్రాయము. ఈ పండుగనాడు ఈప్రకారము చేయవలయునని ధర్మసింధువు చెప్పుచున్నది.

"నూతన సంవత్సరకీర్త నాద్యారంభం—
ప్రతిగృహ ధ్వజారోహణం నింబపత్రాశనం
వత్సరాది శ్రవణం నవరాత్రారంభో"

అనగా నీదినమున ప్రతియింటికి తోరణములుకట్టి వేపపూతచే గొజ్జుచేసి భుజించి పంచాంగఫల శ్రవణమును చేయవలయును. కొందరు ఉగాదినుండి శ్రీరామ నవమివఱకు శ్రీరామ నవరాత్రులు చేయుదురు.

"చైత్రశుక్ల ప్రతిపన్మత్స్య జయంతీత్యేకే."

అనుటవలన నీ దినము నాడు మత్స్య జయంతియని కొందఱందురని యనుమానముగా చెప్పినాడు.

"అర్యపర్వపద్ధతి" యను గ్రంథమొకటి పండిత భవానీప్రసాదు (ఆర్య) గారిచే హిందీలో ప్రకటింపబడినది, అందుగొన్ని పండుగల చర్చగలదు. ఈగ్రంథములో గొన్ని విషయములు చాల యుత్తమములుగా నున్నవి. దీనిలో "నవ సంవత్సరోత్సవము" లేక "సంవత్సరేష్టి" యను శీర్షికయందీయుగాదిపండుగ విషయమున నిట్లు వ్రాయబడినది.

"మధుశ్చ మాధవశ్చ వాసంతికావృతూ"
—యజుర్వేదము.

అనగా యజుర్వేదమందు సంవత్సరము వసంతముతో ప్రారంభమగుననియు నా ఋతు మాసముల పేర్లు మధువు మాధవము అనియుండెననియు వీరి యభిప్రాయము, కాని కాలక్రమేణ చైత్రాది మాసములే వ్యవహార సిద్ధములయ్యెనట.

ఈ విషయమై హేమాద్రి యిట్లువ్రాసియున్నాడు.

చైత్రేమాసి జగద్బ్రహ్మ ససర్జ ప్రథమేఽహని
శుక్లపక్షే సమగ్రంతు తదా సూర్యోదయేసతి.

అనగా బ్రహ్మదేవుడు చైత్రశుక్ల ప్రతిపత్తునాడు జగత్తుయొక్క ప్రథమ దివసమును ప్రారంభించెను.

భాస్కరాచార్యులు తమ "సిద్ధాంత శిరోమణి" యను జ్యోతిష గ్రంథమం దిట్లు సెలవిచ్చినారు.

లంకానగర్యాముద యాచ్చభానో
తస్యైవవారే ప్రథమంబభూవ
మధోస్సితాదేర్దినమాసవర్షం
యుగాదికానాం యుగపత్ప్రవృత్తిః

అనగా లంకానగరమందు భాను డుదయించుటచేసి మధుమాసము (చైత్రము)యొక్క శుద్ధపాడ్యమినాడు యుగాదులయొక్క ప్రారంభమయ్యెను. పై శ్లోకమందలి "యుగాది" అను పదము గమనింపదగినది. ఈఉగాది ప్రారంభమున యకారాది పదమగు యుగాదిగానేయుండి యుండవలెను. అది తర్వాత నపభ్రంశము కాకున్న తద్భవమైనదని యెన్నవలెను. హిందీ గ్రంథకారుడు రెండుమూడు విశేషము లీపండుగనుగుఱించి సూచించియున్నాడు. ఔరంగజేబు తనకొడుకగు మొఅజ్జమ్ అనువానికి వ్రాసినజాబులో నీపండుగను గుఱించి యిట్లు ఫార్సీలో వ్రాసెను. "ఈదినము అగ్నిపూజకులగు పారసీకులపండుగ, మఱియునిది కాఫరులైన హిందువుల విశ్వాసానుసారముగ ధిక్కృతుడైన విక్రమాదిత్యుని రాజ్యాభిషేక దివసము. మఱియు హిందూదేశములో నిది సంవత్సరాదిగానున్నది." పై యౌరంగజేబు ధిక్కార వాక్యములలో నొక్కటి గమనింప దగియున్నది. ఈపండుగ పార్సీలకుగూడ సంవత్సరాది పండుగగా నున్నదనుటలో నీ యాచారము ప్రాచీన వేదకాలమందు ఆర్యులు, పార్సీలు కలిసియుండిన కాలపు మర్యాదను సూచించుచున్నది. మరియు పై భవానీ ప్రసాదపండితుని యభిప్రాయమున నీచైత్రాది పర్వమే పూర్వము హిందూస్థానమంతటను నుండెనట. కాని తర్వాత చాంద్రసౌరమాన భేదములు కలిగినతర్వాత దక్షిణమున చైత్రమాసమందును నుత్తరమున మేష సంక్రాంతినాడును నీపండుగజేయు నాచారమయ్యెనట. ఈపండితుని యభిప్రాయములు గమనింపదగినవి.

పార్సీలలో ఉగాదిని నౌరోజ్ అనగా క్రొత్తదినము అనియందురు. ఇది సాధారణముగా ఇంగ్లీషు మాసమగు మార్చినెలలో వచ్చును. అనగా వసంత కాలారంభమందు వచ్చును. ఇంచుమించుగా మన ఉగాది వచ్చుకాలములో వారికిని సంవత్సరాది పండుగ వచ్చుచుండును.



## ఆంధ్ర మహా సభాధ్యక్షుల పర్యటన

మహబూబునగరము జిల్లా
(గోలకొండ విలేఖరి)

బూతుపురము
మార్చి ౨౬.

మహబూబునగరము నుండి ౧౩ మార్చి ఉదయము (౯) గంటలకు అధ్యక్షులవారు, వారివెంబడి యున్న సహచరులు బయలుదేరి బూతుపూరు గ్రామమునకు (౧౦) గంటలకు చేరిరి. ఇక్కడి వ్యవసాయదార్లను కలిసి పంటలస్థితి విచారించుకొని, పట్టీసంఘమును స్థాపించి, ఆంధ్రోద్యమము గురించి ప్రబోధించబడెను. (౧౧) గంటలకు భోజనము చేసి, బయలుదేరి శాఖాపురము (౧-౨-౩౦ గంటలకు విచ్చేసిరి.

శాఖాపురము

ఈ గ్రామము మహబూబునగరము తాలూకాలో చేరినది. ఇచటి పనిపాటలవారు, వ్యవసాయదార్లు గుమిగూడి, వచ్చిన ప్రముఖులతో కలిసికొనిరి. ఇచట వర్షములులేక పుణాస పంటలుకాని, రబీపంటలుకాని పండలేదనియు, చెరువులో నీరు సరిగా నిలువకపోవుటవలన తాబీ చేలకుకూడ సరిగా నీరుదొరకక వరి చేలు కూడ నష్టమైనవనియు, గ్రామములో సగముకన్న ఎక్కువమంది ఒకపూటయైన తిండిలేక అవస్థపడుచున్నారనియు, కొందరు గ్రామము వదలి ఎక్కడికో వెడలిపోయినారనియు, గ్రామమునకు సమీపముననున్న వీటికి వంతెనకాని, లేక చెరువును బాగు చేయించుటకై ప్రభుత్వమువారు అనుమతిచ్చినచో, పనికలిపించినచో, గ్రామస్థులకు, చుట్టుప్రక్కల వారికి నెల రెండునెలలవరకైనను జీవనం జరుగుటకు అవకాశము చిక్కునని తెలుపుకొనిరి. వెట్టిచాకిరిని నిషేధించిన ప్రభుత్వమువారి అజ్ఞను, పనిపాటలవారికి విశదీకరింపబడినది. పిదప అధ్యక్షులవారు, తమ సహచరులతో బయలుదేరి, అడ్డాకులకు బయలుదేరి. అడ్డాకులకు (౧) గంటకు ప్రవేశించిరి.

అడ్డాకుల

ఈగ్రామము మహబూబునగరము తాలూకాలో చేరినది. అధ్యక్షులవారు, తమ పరివారముతో గ్రామములోనున్న హనుమద్దేవాలయములోనుండగా, గ్రామరైతులు, హరిజనులు విచ్చేసి, తమకష్టములు వెలిబుచ్చిరి. వెట్టిచాకిరిపై ప్రబోధము చేయబడెను. (౨) గంటలకు బయలుదేరి కొత్తకోట గ్రామమునకు ప్రవేశించిరి.

కొత్తకోట

ఈగ్రామము వనపర్తి సంస్థానము తాలూకాది. ప్రస్తుతము కోర్టువిగానీలో నున్నది. గ్రామరైతులు అధ్యక్షులవారిని దర్శించి, తమపై పన్నులు అత్యధికముగా నున్నవనియు, ఈ తాలూకాలో అక్రమమైనపట్టీలు యింకను అమలులోనున్నవనియు, పానాదుగుత్తా, తేనెగుత్తా, చర్మములగుత్తా, నూనెగుత్తా, గడ్డిగుత్తా. ఖస్సాయిగుత్తా, గోందుగుత్తా, మొహతరఫాపన్ను, రంగనాయకులపట్టీ, కనకమ్మగారిగుత్తా, మగ్గాలపన్ను, ఉత్సవాలనెయ్యి, ఈ లాటివన్నియూ గుత్తాలకేలముజరిగి పన్నువసూలు చేయుచున్నారనియు తెలిపిరి. పనిపాటలవారికి వెట్టిచాకిరిగురించి ప్రభుత్వపు అజ్ఞలను వచ్చిన ప్రముఖులకు తెలిపిరి. పిదప (౫) గంటలకు బయలుదేరి వనపర్తికి సాయంత్రము (౬) గంటలకు అధ్యక్షులవారు తమ సహచరులతో ప్రవేశించిరి.

వనపర్తి

ఈగ్రామము వనపర్తి సంస్థానాధీశుల రాజధాని. ప్రస్తుతము కోర్టు నిగానీలో ఈసంస్థానము పరిపాలింప బడుచున్నది. వీధులు బహుసుందరముగానుండి సఫాయిఏర్పాటు సక్రమంగానున్నది. హైస్కూలు వరకు విద్య గరపబడుచున్నది. రెడ్డి విద్యార్థుల సౌకర్యార్థమై శ్రీయుత ఎం. నారాయణరెడ్డిగారు వసతి గృహము ఏర్పరచి దీనిని శ్రీరెడ్డిగారు దీక్షతో నడుపుచున్నారు. అధ్యక్షులు, వారిసహచరులను, కీ.శే. ధర్మవీర వామన్‌నాయకుగారి భవనమందు బసయేర్పాటు చేయబడినది. ఆరాత్రి ఇక్కడనేఉండి శ్రీయుత నారాయణరెడ్డిగారితో, ఆంధ్రోద్యమముగురించి ముచ్చటించి, వనపర్తివంటి స్థలమందు గ్రంథాలయముకాని లేకుండుట. స్థానికులకు ప్రపంచజ్ఞానము అర్జించుటకు సాధనోపాయములు లేకపోవుట చాలా లోపమనియు, ఈలోపమును తొలగించుటకై, శ్రీరెడ్డిగారిని శ్రద్ధవహించవలెనని కోరిరి, అధ్యక్షులవారి సూచనలను శ్రీరెడ్డిగారు అదరణతో వినిరి. అచిరకాలములోనే ఒక గ్రంథాలయము స్థాపింపబడునని గ్రామస్థులకు ఆశగలిగినది మరునాడు ఉదయము (౯) గంటలకు ఫలహారము తేనీరుగైకొని, అధ్యక్షులవారు తమసహచరుల వెంబడిగోపాలపేట చేరిరి.

గోపాలపేట

ఇది సంస్థానగ్రామము, శ్రీమాన్ అప్పలాచార్యులవారు (ఖాల్సామాల్ ఉద్యోగి) కొన్ని రోజులనుండి, గోపాలపేట సంస్థానములో తాలూకాదారీపదవియందు నియమింపబడినారు. అధ్యక్షులవారు గ్రామస్థులను కొందరినిదర్శించి మాట్లాడగా, శ్రీ ఆచార్యులవారు పదవిస్వీకరించినప్పటినుండి, సంస్థానప్రజల బాగోలు కొరకై సర్వవిధముల ప్రయత్నించుచున్నారనియు, కొంతకాలము పరిపాలనాధీనములో నున్నచో; తమఇబ్బందులన్నియు నిర్మూలించుననియూ ప్రజలు తెలుపుకొనిరి. ఇక్కడినుండి అధ్యక్షులవారు తమపరివారముతోబయలుదేరి, శ్రీరంగాపురము చూచుచు కేతేపల్లి ప్రవేశించిరి.

కేతేపల్లి

ఈగ్రామము నాగరకర్నూలు తాలూకాలో చేరినది. ఇచట హరిజనులు అధ్యక్షులవారిని కలిసి వెట్టిచాకిరివల్ల తమకున్న ఇబ్బందులు తెలుపుకొనిరి. ప్రభుత్వపుఅజ్ఞలు హరిజనులకు వచ్చిన ప్రముఖులు తెలిపిరి. పిదప తెల్లరాళ్లపల్లికి వెళ్లిరి.

తెల్లరాళ్లపల్లి

ఈగ్రామము జటప్రోలు సంస్థానములోచేరినది. ఆనాడు ఇచట, దేవతాసన్నిధిన సమారాధన నున్నందున, పరిసర గ్రామాలనుండి రైతులు, వర్తకులు, మున్నగువారు విచ్చేసియుండిరి. ఈ అవకాశమును పురస్కరించుకొని, అధ్యక్షులు, వారిసహచరులు, వారికందరికి ఆంధ్రోద్యమము గురించి ఉద్బోధించిరి, మూడు పట్టీసంఘములు—(౧) కేతేపల్లి, (౨) గోవరావుపల్లి, (౩) తిగలపల్లి, ప్రముఖుల సమాలోచనతో స్థాపింపబడినవి. ఈపట్టీ సంఘములకు కార్యనిర్వాహకులు ఎన్నుకోబడిరి. జిల్లా సంఘనిర్మాణ కార్యక్రమమును అయాపట్టీ సంఘములద్వారా విరివిగా ప్రచారముద్వారా నడిపించుటకై అయాపట్టీ సంఘముల కార్యనిర్వాహకులుకోరబడిరి. ఆరాత్రి అచటనే వచ్చిన ప్రముఖులు విశ్రాంతిగైకొనిరి.

## సేలంలో సంపూర్ణ మద్య నిషేధ ఫలితములు

### మదరాసు విద్యాపీఠ పరిశోధన విద్యార్థులు పరిశీలించబోవుట

మదరాసు: మార్చి ౨౭

మదరాసు విశ్వవిద్యాపీఠ పరిశోధనవిద్యార్థులకొందరు విశ్వవిద్యాపీఠముచే సేలంజిల్లాలో మదరాసు ప్రభుత్వమువారిచే అమలుచేయబడిన సంపూర్ణ మద్యనిషేధ ప్రణాళిక ఫలితములను పరిశీలించుటకై పంపబడినారని ౧౯౩౭సం॥ నకు సంబంధించిన నివేదికను సెనేటుసభలో ప్రవేశపెట్టుచు సెడుతదయము హెచ్.వి. పాప్ వర్తుగారు తెలిపిరి. ఈనివేదికలో ఇది ముఖ్యముగ గమనించదగిన అక్షణమనిరి, దీనివలన విశ్వవిద్యాపీఠమునకును ప్రజలకును సన్నిహితసంబంధమేర్పరచుటకు ప్రారంభము చేయబడినదనిరి.

సేలంజిల్లాలో అట్టిపరిశీలన చేయుటకు ఏర్పాటు చేయించవలసినదిగ మదరాసుప్రధాన మంత్రి మదరాసు విద్యాపీఠము యొక్క వైస్‌ఛాన్సెలర్ గారికి వ్రాసియుండినట్లు బషీరుఅహమ్మదు సయ్యద్‌గారు తెలిపిరి. ఆలేఖనుగూర్చి, అట్టిపరిశీలనను పూనుకొనుట అవసరమనికొందరును, మంచిదిగాదని కొందరును చాలదూరము వాదించిన తర్వాత మదరాసు ప్రధాని లేఖ అంగీకరించబడెను.

## చీనా సైనికులు జపానువారిని తరుముట

హాంకాంగ్, మార్చి ౨౮

చీనా సైనికులు నూతనాస్త్రముల ధరించి అమితోత్సాహముతో పెద్ద కాలువదాటి హాంచ్యాంగ్‌ను ఆక్రమించుకొనిరి. రెండవ చీనా సైనికదళము తైక్‌చ్యాంగును స్వాధీనపరచుకొనెను. చీనా సైనికులకు కలిగిన యీవిజయమువలన తాక్‌చ్యాంగు, యూస్సేన్‌నుండి జపాను సైనికులు పలాయనులగుచున్నారు. ఈ రెండు ప్రదేశములు చీనా సైనికులచే నాక్రమింపబడియున్నవి.


గోలకొండపత్రిక
(జాతీయ అర్ధవారపత్రిక)
హైద్రాబాద
చందా వివరములు
సంవత్సరమునకు రు ౬లు
అర్ధసంవత్సరమునకు రు ౩లు
విడిపత్రిక ౧ అణా

# H. E. H. The Nizam's State Railway

## మహా ఘనత వహించిన నిజాం సంస్థానపు రైల్వే

**1 వ ఏప్రిల్ 1938 నుండి అమలునకువచ్చు ప్యాసింజరు బండ్లు**

## రాకపోకల కాలముల సంగ్రహము

## బ్రాడుగేజ్ [పెద్దలైను]

| స్టేషను | | 2 ప్యాసిం. జరు | 8 ప్యాసిం. జరు | 22 మిక్స్డ్ | 4 ప్యాసిం జరు | 102 షటిల్ | 12 ప్యాసిం జరు | 10 ప్యాసిం జరు |
|---|---|---|---|---|---|---|---|---|
| | | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. |
| వాడి | పోక | 3 22 | | బీదర్ నుండి | 11 32 | | | పర్లినుండి |
| వికారాబాద | రాక | 6 12 | | 9 29 | 13 55 | | | 18 13 |
| | పోక | 6 20 | | 9 53 | 14 03 | | | 18 21 |
| బేగంపేట | ,, | 7 42 | | 11 57 | 15 19 | | | 19 43 |
| హైదరాబాద | రా. | 7 54 | | 12 12 | 15 30 | | | 19 53 |
| బి. జి. | పోక | 8 10 | 14 30 | 12 24 | 15 39 | 17 4 | 19 00 | 20 2 |
| సికింద్రాబాద | రాక | 8 27 | 14 47 | 12 56 | 16 08 | 17 40 | 19 30 | 20 30 |
| | పోక | 8 57 | 15 0 | | | 17 45 | 19 50 | |
| భోనగిరి | ,, | 10 2 | 15 53 | | | 19 16 | 20 43 | |
| కాజీపేట | రాక | 12 18 | 17 35 | | | రాక | 22 40 | |
| | | | | | | 14 మిక్స్డ్ | 6 జి.టి. ఎక్స్ప్రెస్ 21-08 ఢిల్లీనుండి | |
| బల్హార్షా | రా. | | | | | | | |
| | పో. | | | | | 6 50 | 21 32 | |
| కాజీపేట | రా. | | | | | 14 10 | 2 45 | |
| | పో. | 12 28 | 17 47 | | | | 3 10 | |
| వరంగల్ | ,, | 12 39 | 17 58 | | | | 3 21 | |
| డోర్నకల్ జంక్షన్ | రా. | 14 26 | 19 31 | | | | 4 51 | |
| | పో. | 14 41 | 19 48 | | | | 5 06 | |
| బెజవాడ | రా. | 17 10 | 22 25 | | | | 7 42 | |
| | పో. | | | | | | మద్రాసుకు 8 02 | |

| స్టేషను | | 1 ప్యాసిం. జరు | 7 మిక్స్డ్ / ప్యాసిం | 11 ప్యాసిం జరు | 9 ప్యాసిం జరు | 5 జి. టి. ఎక్స్ప్రెస్ / 101 షటిల్ | 13 మిక్స్డ్ / 3 ప్యాసిం జరు | 21 మిక్స్డ్ |
|---|---|---|---|---|---|---|---|---|
| | | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | గం. ని. | |
| బెజవాడ | రా. | | | | | 17 15 మ. నుండి | | |
| | పో. | 5 20 | 8 12 | | | 17 35 | | |
| డోర్నకల్ జం. | రా. | 7 56 | 11 48 | | | 20 20 | | |
| | పో. | 8 11 | 12 03 | | | 20 40 | | |
| వరంగల్ | ,, | 9 51 | 14 46 | | | 22 18 | | |
| కాజీపేట | రా. | 10 9 | 15 06 | | | 22 34 | | |
| | పో. | | | | | 22 58 | 15 42 | |
| బల్హార్షా | రా. | | | | | 4 10 ఢిల్లీకి | 22 22 | |
| | పో. | | | | | 4 35 | | |
| కాజీపేట | రా. | | | | | | | |
| | పో. | 10 21 | 16 00 | 3 22 | | | | |
| భోనగిరి | ,, | 12 14 | 18 32 | 5 27 | | 7 11 | | |
| సికింద్రాబాదు | రా. | 13 10 | 19 41 | 6 23 | | 8 30 | | |
| | పో. | 13 25-17 10 | 19 58 | 6 36 | 7 21 | 8 35 | 9 12 | 13 05 |
| హైదరాబాదు | రా. | 13 46-17 38 | 20 36 | 7 03 | 7 42 | 9 0 | 9 40 | 13 32 |
| బి. జి. | పో. | ... 17 46 | | | 7 57 | | 9 48 | 13 50 |
| బేగంపేట | ,, | ... 17 57 | | | 8 9 | | 9 57 | 14 07 |
| వికారాబాద | రా. | ... 19 24 | | | 9 25 | | 11 15 | 16 38 |
| | పో. | ... 19 44 | | | 9 33 | | 11 27 | 16 52 |
| వాడి | రా. | ... 22 12 | | | పర్లీకి | | 14 05 | బీదరుకు |

### బ్రాంచిలైను రైళ్లు

#### వికారాబాదు- పర్లి-- వైద్యనాథ్ సెక్షన్.

| స్టేషను | | 9 ప్యాసిం- | 21 మిక్స్డ్ |
|---|---|---|---|
| | | గం. ని. సికిం. నుండి | గం. ని. సికిం. నుండి |
| వికారాబాదు | రాక | 9 25 | 16 38 |
| | పోక | 9 33 | 16 52 |
| మహమ్మదాబాదు బీదరు | రాక | 11 52 | 20 45 |
| | | మిక్స్డ్ | |
| | పోక | 12 09 | |
| పర్లి, వైద్యనాథ్ | రాక | 19 40 | |

| స్టేషను | | 10 మిక్స్డ్ | 22 మిక్స్డ్ |
|---|---|---|---|
| | | గం. ని. | గం. ని. |
| పర్లి- వైద్యనాథ్ | పోక | 7 30 | |
| మహమ్మదాబాదు బీదరు | రాక | 15 32 | |
| | | ప్యాసిం | |
| | పోక | 15 54 | 6 00 |
| వికారాబాదు | రాక | 18 13 | 9 29 |
| | పోక | 18 21 | 9 53 |
| | | సికిం. కు | సికిం. కు |

#### డోర్నకల్ జంక్షన్ సింగరేనికాలరీసు

| స్టేషను | | 18 మిక్స్డ్ | 20 మిక్స్డ్ |
|---|---|---|---|
| | | గ. ని. | గ. ని. |
| డోర్నకల్ జంక్షన్ | పోక | 8 54 | 15 05 |
| సింగరేనికాలరీస్ | రాక | 10 22 | 16 40 |

| స్టేషను | | 17 మిక్స్డ్ | 19 మిక్స్డ్ |
|---|---|---|---|
| | | గ. ని. | గ. ని. |
| సింగరేనికాలరీస్ | పోక | 12 25 | 18 28 |
| డోర్నకల్ జంక్షన్ | రాక | 13 40 | 19 38 |

#### డోర్నకల్ జంక్షన్ భద్రాచలం రోడ్డు

| స్టేషను | | 16 మిక్స్డ్ |
|---|---|---|
| | | గ. ని. |
| డోర్నకల్ జంక్షన్ | పోక | 8 15 |
| భద్రాచలంరోడ్డు | రాక | 10 22 |

| స్టేషను | | 15 మిక్స్డ్ |
|---|---|---|
| | | గ. ని. |
| భద్రాచలంరోడ్డు | పోక | 12 |
| డోర్నకల్ జంక్షన్ | రాక | 14 09 |

## మీటర్ గేజ్ [చిన్నలైను]

| స్టేషను | | 39 షటిల్ / 37 ప్యాసిం / 44 షటిల్ | 35 ప్యాసిం / 48 షటిల్ | 34 ప్యాసిం. | 30 ప్యాసిం / 54 షటిల్ | 41 షటిల్ / 32 ప్యాసిం | 27 ప్యాసిం |
|---|---|---|---|---|---|---|---|
| | | గం. ని. | గ. ని. | గం. ని. | గం ని | గం ని | గం ని |
| ద్రోణాచలం | పోక | 6 20 | 10 40 | | | 15 30 | 21 25 |
| కర్నూల్ టవున్ | రాక | 7 33 | 11 48 | | | 16 42 | 22 36 |
| | పోక | | 12 02 | | | | 22 50 |
| మహబూబు నగర్ | రాక | | 15 47 | | | | 2 32 |
| | పోక | 7 30 | 15 55 | | | | 2 42 |
| హైద్రాబాద్ యం. జి. | రాక | 10 36 | 18 44 | | | | 5 29 |
| | పోక | 10 39 | 18 52 | 6 50 | 16 45 | 19 15 | 5 34 |
| సికిందరాబాద్ | రాక | 10 58 | 19 12 | 7 20 | 17 08 | 19 40 | 6 00 |
| | పోక | | | 7 33 | 17 18 | 20 00 | |
| నిజామాబాదు | రాక | | | 12 00 | 22 08 | 23 47 | |
| | పోక | | | 12 14 | | 23 5. | |
| నాందేడు | పోక | | 12 10 | 15 15 | | 2 31 | |
| పూర్ణా | రాక | | 13 47 | 16 0 | | 3 10 | |
| | పోక | 20 30 | 14 30 | 16 15 | 6 15 | 3 27 |
| పర్భిణి | రాక | 21 32 | 15 03 | 16 51 | 7 11 | 4 06 | |
| | పోక | 22 10 | 15 42 | 16 59 | 7 19 | 4 14 | |
| జాల్నా | రాక | పర్లీకి | పర్లీకి | 20 07 | 10 57 56ష.లో | 7 01 | |
| | పోక | | | 20 27 | 11 20 | 7 16 | |
| ఔరంగాబాద్ | ,, | | | 22 07 | 13 28 | 8 57 | |
| మన్మాడు | రాక | | | 1 04 | రాక | 11 51 | |

| స్టేషను | | 33 ప్యాసిం. / 40 షటిల్ | 31 పాసిం. | 55 కోచి / 53 షటిల్ / 29 ప్యాసిం | 43 షటిల్ / 36 ప్యాసిం. | 47 షటిల్ / 38 పాసిం. / 42 మిక్స్డ్ | 28 ప్యాసిం |
|---|---|---|---|---|---|---|---|
| | | గం. ని. | గ. ని. | గ. ని. | గం. ని. | గ. ని. | గ. ని. |
| మన్మాడ్ | పోక | 3 57 | 14 21 | | | | |
| ఔరంగాబాదు | ,, | 6 35 | 17 11 | 13 40 | | | |
| | రాక | 8 15 | 18 54 | 15 41 | | | |
| జాల్నా | పోక | 8 30 | 19 09 | 15 57 | పర్లినుం | పర్లినుం | |
| పర్భిణి | రాక | 11 19 | 21 46 | 19 11 | 3 54 | 9 10 | |
| | పోక | 11 27 | 21 54 | 19 10 | 4 37 | 9 20 | |
| పూర్ణా | రాక | 12 04 | 22 35 | 20 15 | 5 40 | 10 23 | |
| | పోక | 12 22 | 22 50 | | | 10 50 | |
| నాందేడు | ,, | 12 58 | 23 33 | | | 11 55 రాక | |
| నిజామాబాదు | రాక | 15 54 | 2 25 | | | | |
| | పోక | 16 04 | 2 35 | 4 30 | | | |
| సికిందరాబాదు | రాక | 20 41 | 6 56 | 9 38 | | | |
| | పోక | 20 53 | 7 23 | 9 48 | 7 6 | 17 35 | 21 25 |
| హైద్రాబాదు యం. జి. | రాక | 21 10 | 7 40 | 10 08 | 7 20 | 17 50 | 21 39 |
| | పోక | | | | 7 28 | 17 58 | 21 45 |
| మహబూబునగర్ | రాక | | | | 10 7 | 21 10 | 0 32 |
| | పోక | | | | 10 15 | | 0 40 |
| కర్నూల్ టవున్ | రాక | | | | 13 22 | | 4 05 |
| | పోక | 8 30 | | | 13 38 | 17 22 | 4 17 |
| ద్రోణాచలం | రాక | 9 50 | | | 14 56 | 20 50 | 5 40 |

### బ్రాంచిలైను రైళ్లు

#### పూర్ణా — హింగోలీ సెక్షన్

| స్టేషను | | 45 మిక్స్డ్ |
|---|---|---|
| | | గం. ని. |
| పూర్ణా | పోక | 7 10 |
| హింగోలీ | రాక | 10 40 |

| స్టేషను | | 46 మిక్స్డ్ |
|---|---|---|
| | | గం ని. |
| హింగోలీ | పోక | 12 20 |
| పూర్ణా | రాక | 15 35 |

#### పర్భని — పర్లీవైద్యనాథ్ సెక్షన్

| స్టేషను | | 44 షటిల్ | 48 షటిల్ |
|---|---|---|---|
| | | గం.ని. పూర్ణా నుండి | గం.ని. నాందేడ్ నుండి |
| పర్భని | రాక | 21 32 | 15 32 |
| | పోక | 22 10 | 15 42 |
| పర్లి- వైద్యనాథ్ | రాక | 0 40 | 18 10 |

| స్టేషను | | 43 షటిల్ | 47 షటిల్ |
|---|---|---|---|
| | | గం.ని | గం.ని. |
| పర్లి- వైద్యనాథ్ | పోక | 1 26 | 6 40 |
| పర్భని | రాక | 3 54 | 9 10 |
| | పోక | 4 37 | 9 20 |
| | | పూర్ణాకి | నాందేడుకు |

సికింద్రాబాద,
తేది 10మార్చి 1938 ఈ.

బి. ఏ. జె. డక్ లాఫ్,
ఆక్టింగు—చీఫ్ ట్రాన్స్పోర్టేషన్ సూపరింటెండెంటు

# సేలంలో సంపూర్ణమద్యనిషేధ

# లాభములు

## అప్పుల భారములు తొలగినవి

## చాలినంత ఆహారము లభించుచున్నది

### హాయిసౌఖ్యము హెచ్చినది

## సేలంజిల్లా కలెక్టరు నివేదిక

మదరాసు ప్రభుత్వమువారు సేలం జిల్లాలో సంపూర్ణ మద్యపాననిషేధ విధానమును అమలుపరచినసంగతి అందరికిని తెలిసినదే. ఆవిధానము జయముగాంచినటుల ప్రధానమంత్రి శ్రీయుత రాజగోపాలాచారిగారు ఇదివరకే ప్రకటించియుండిరి. ఆవిధానమువలన ఆజిల్లా ప్రజలకు కలిగినమేళ్లనుగూర్చి ఆజిల్లా కలెక్టరుగారొక గీర్ఘమైన నివేదిక తయారుచేసియున్నారు. దానినుండి ఈ క్రిందిభాగములను ప్రకటించు చున్నాము.”

“మద్యనిషేధముచే జనుల జీవితములయందు గలిగిన మార్పులనుగూర్చి, వారల భావములను నాభావములను సంక్షేపముగ తెలిపి, ఉదాహరణములైన రెండువ్యక్తుల జీవితములనుగురించి వివరములను తెలుపుటకన్న ఈ నివేదికయందు ఎక్కువచేయుట సాధ్యముగాదు.

“(అ) స్త్రీలయొక్కయు శిశువులయొక్కయు స్థితి

ఇప్పటికి తెలిసిన సమాచారమంతయు ఇదివరకెప్పుడు త్రాగుడుఅలవాటుగలవారలయొక్క గృహజీవనమును (మద్యనిషేధ) శాసనము బాగుచేసినదను విషయమునే నిరూపించుచున్నది. ఉగ్రములైన ఇంటితగవులు అదృశ్యములైనవనియే చెప్పబడెను. స్త్రీలయొక్కయు శిశువులయొక్కయు స్థితి చాలా బాగుపడినది, ఇదివరకు మితముగా మద్యనిషేవణమున కలవడియున్నవారల ఆరోగ్యమును, జఠరాగ్నియు మంచిస్థితికి వచ్చునట్లు నాకు తెలిసినవారందరును చెప్పిరి. అపరిమితముగా త్రాగుచుండిన వారలగూర్చి పలువిధముల తెలుపబడినది. అట్టి విపరీత మద్యపాయులలో కొందరు ఇదివరకే ఆరోగ్యము చెడియున్నవారలు, చెడిపోయిరి. ఇతరులకు క్రొత్తపరిస్థితులకు తగినట్లు మారుట కష్టమనిపించుచున్నది. వారలు ఇదివరకు చేసినంత పనిని చేయుటకు అశక్తులైయున్నారు. కాని విపరీత మద్యపాయులనేకులు తమ త్రాగుఅలవాటు పోగొట్టుకొనినారు, వారల ఆరోగ్యమును సామాన్యస్థితియు చాల అభివృద్ధి చెందినవి.

“(ఆ) జనుల ఆర్థికస్థితి

ఇది కొంత బాగుపడినదనునది నిజమే, కాని సామాన్యముగా దరిద్రులకు మితవ్యయమలవడునను ఆశ ఇంతవరకు సఫలము గాలేదు. తిండి ఆహార పరిమాణమునుబట్టి చూచునో పూర్వముకంటె జీవనము ఉచ్చతరమైనదని స్పష్టముగా తెలియగలదు. పూర్వము త్రాగుచుండినవార లిదివరకు సాయంకాలము తృప్తికరమైనభోజనములేక యుండెడివారు. వారలకిపుడు అది దొరకుచున్నది.

“(ఇ) మద్యనిషేధముచే పూర్వము మద్యపానముచేయువారల ఆర్థికస్థితిలో గలిగిన మార్పులను అక్కడకొన్ని ఇక్కడకొన్ని ఉదాహరణములగైకొని, వాటిచే ఉదహరించెదను.

“౬. పుతూరు, తీరిపట్టి, ఆచన్కుట్టిపట్టి అను మూడుఊళ్లలో ఇదివరకు మద్యపానము చేయుచుండినవారలు తమకిదివరలో ప్రతిరోజు మద్యమునకు పైసలు కొరలసి వచ్చుచుండెననియు, కాని ప్రతిరోజు తమకు పైసలు దొరకుచుండెడివికావనియు, కొబ్బరితోట తరువాత కోతకాలములో తక్కువధరకు ధాన్యము(వడ్ల) నమ్మి అప్పుతీర్చెదమని చెప్పి, అప్పుచేయుచుంటిమనియు చెప్పిరి, కోతకాలములో వారలకు లభించిన వరిపంటలో అధికభాగము అప్పిచ్చినవారలకు ఆ అప్పులను తీర్చుటకై తక్కువధరకు అమ్మబడుచుండెను. ఈసారి కోతకాలములో మద్యమే దొరకనందువలన వారలు అప్పే చేయలేదు. వారావడ్లను అమ్మియుంచినారు. ఇదివరకు త్రాగుడు కలవాటుపడిన ఇంకొకడు గనభూములను చూచుచుండుటకై పనివారలను పెట్టియుండెను. అతనిగ్రామములో కొనబడిన ప్రతిబుడ్డికి అతనికి రాఅణాలు దలాలీ లేదా గాన వచ్చును. ఇట్లు అతనికిరోజుకి రు ౧-౮-౦ మొదలు రు ౩ లవరకు సంపాదనయుండెను. మద్యనిషేధశాసనము ప్రవేశపెట్టుటకు పూర్వము కడపటి ౧౦రోజులలో అతడు మద్యపానమునకై రూ ౩౦లు వెచ్చించెను. అతడు ఎల్లప్పుడును మత్తెక్కియుండెడివాడు, అతనుఒకమార్గము వేయించుటకై ఒడంబడిక చేసికొని రూ ౧౫౦లు అప్పుచేసెను. దానిలోనుండి రూ ౫౦లు మద్యముపై ఖర్చుచేయబడెను. మద్యనిషేధము ప్రవేశపెట్టినతరువాత అతడు రూ ౭౦లు మిగిలించుకొనగలిగెను. అందులోనుండి అతడురూ౩౦లు తిరిగిచెల్లించివేసెను. ఇప్పుడు అతనివద్దఇంకను రూ ౪౦లున్నవి.

“మేలపల్లి గ్రామములో ఇదివరకు మద్యపానముచేయుచుండినయొకడు ఇదివరకు మద్యముపైతాను సంపాదించినదంతయు ఖర్చుపెట్టుచుండెడివాడనియు, అందుచే అతనికుటుంబములోచేరిన అతనిభార్యయు ముగ్గురుబిడ్డలును రోజుకు ఒక్కపూటయైనను ఆహారము లభించుట కష్టముగానుండెడిదనియు చెప్పినాడు. అతనికిని అతనిభార్యకును పలుమారులు తగవులు జరుగుచుండెడివి. ఎన్నియోసారులు అతడు భార్యనుకొట్టినాడు. అతడు తనకున్న ౩ ఎకరముల భూమిని అమ్మివేసెను, అతనిబిడ్డలిరువురు సరియైన ఆహారములేక మరణించిరి. మద్యనిషేధశాసనము వచ్చినతర్వాత, వారలకు రోజుకు రెండుపూటలభోజనము దొరుకుచున్నది. ఒక్కొక్కరోజు మూడుపూటలభోజనముకూడ లభించుచున్నది. అతనికి మిగిలినడబ్బుతో అతడు రూ౧౩లకు రెండు ఎడ్లను, తనభార్యకును బిడ్డలకును రూ౭లకు గుడ్డలను కొనగలిగినాడు.

“ఒక ముసలివాడు, ఇదివరలో కల్లుగీయువాడు మద్యపాన నిషేధమునకు పూర్వము కూలిపని చేయుచుండెడివాడు. అతడు రోజుకు ౫ అణాలు సంపాదించుకొనగలుగుచుండెడివాడు. ఇట్లు సంపాదించినదానినతడు మద్యపానమునకై ఖర్చుపెట్టెడివాడు అతడిపుడు ఏపనిగాని చేయజాలక, విశేషముగాభార్యసంపాదనముపై జీవించుచున్నాడు. క్రొత్తపరిస్థితులకు తగినట్లు మారజాలనంత ముసలియైన ఒకపూర్వపు కల్లుగీయువానికిది తగినఉదాహరణము. కొందరు కృశించి మరణించినట్లు తెలుపబడినది.

“సేలం పురపాలక సంఘముయొక్క ఉద్యోగములోనున్న పాకీపనివారలు తమ మద్యపానపు ఖర్చులకై విశేషముగా ఇద్దరు వడ్డీవ్యాపారస్థులనుండి అప్పుచేయుచుండెడివారలు. వారలుతమ జీతములురాగానే వాటినివెంటనే ఋణదాతల కిచ్చుచుండెడివారు. వారలిపుడు తమ అప్పులనన్నిటిని తీర్చివేసికొనునట్లును తమజీవనమున కవసరమైనవాటిని దబ్బిచ్చి కొనుచున్నట్లును తెలుపబడినది.

“రాజేంద్ర స్పిన్నింగుమిల్సు లిమిటెడ్, యొక్క మేనేజింగు డైరెక్టరు తమపనివాండ్రలో చాలమంది సరిగా పనికి హాజరగుచుండెడివారలు గారనియు, అందుచే యంత్రములనేకులు రాత్రిపనివారలు రానందుచే పనిచేయకయుండవలసి వచ్చుచుండెడిదనియు తెలిపినారు. మద్యనిషేధము ప్రవేశపెట్టబడిన ఒకనెల తర్వాత, పనివారలు సరిగా హాజరుకాసాగిరి. కనుక మిల్లును రాత్రింబవళ్లు నడిపించుటకు చాలినంత పనివారలు క్రమముతప్పక లభించసాగిరి. మద్యనిషేధమునకుపూర్వము రాత్రివేళల తగవులు తఱచుగా నుండెడివి. అతగవులను తీర్చి పనివారలను శాంతపరచుటకై అనేకపర్యాయములు నిద్రలేవవలసి వచ్చుటచే మేనేజింగు డైరెక్టరుగారికి ఎప్పుడును నిద్రపట్టెడిదిగాదు. ఈతగవులిపుడు తీరినవి. యంత్రములిప్పుడు సరిగా సంరక్షింపబడుచున్నవి. ఉత్పత్తి సరిగా రెండింతలైనది. మద్యనిషేధము విశేషముగా యంత్రశాలలో స్త్రీలకు ఎక్కువక్షేమకరమైనది. వారలు ఎప్పుడుచూచినను జబ్బుగాను, మురికిగాను, చింపిరిగుడ్డలతోను నుండెడివారలు. ఇపుడు ప్రతిస్త్రీకిని రెండు లేకమూడుచీరలు ఉన్నవి. వారలలో చాలమందికి రవికెలున్నవి. వారలలో సగముమంది ప్రతిరోజు గుడ్డలు శుభ్రపరచుకొందురు. వారల ఆర్థికస్థితి కూడ బాగుపడినది. ఖర్చు ఎక్కువగుటచే గిర్వీపెట్టియుండిన వారల నగలను వారలిపుడు విడిపించుకొనినారు. పిల్లలకు మంచివస్త్రములున్నవి. వారలు శుభ్రముగానున్నారు. నివాసగృహములు బాగుపడినవి. ఇదివరకు దీపములులేని గృహములలో ఇపుడు దీపములువచ్చినవి.

---

The only
Leading National
*Bi-weekly*
of the
Andhra Provinces.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA
The only out-standing effective medium for the ventilation of views and grievances of 70,00,000 Andhras of the Premier State

*Volume* **12** | **Hyderabad-Dn.** | **Thursday 31 St March 1938** | *Number* **91**

## డా. షూప్నిగ్ పై నేరారోపణము

వైయన్నా, మార్చి ౨౯,

ఇంతకుపూర్వము ఆస్ట్రియాచాన్సెలరుగా నుండిన డాక్టరు షూష్నిగ్ పై లీప్జిగు యున్నత న్యాయస్థానమునందు రహస్యముగ విచారణ జరుగునని ప్రకటింపబడును. వీరు ప్రజాభిప్రాయము కనుగొనిన నేరము విచారింపబడును— డా. డాల్ఫస్ హంతకులకు శిక్షవేయుటకైన సందర్భమున వీరు న్యాయశాఖామాత్యులుగా నుండిరి. అందువలన వీరా సమయమున ఆ న్యాయముగా మరణశిక్ష విధించిరను నేరము సహితము మోపబడును.

## జపానువారి సామ్రాజ్యయోత్తులు

టోక్యో, మార్చి ౨౯.

నాన్కింగు యొక్క నూతనప్రభుత్వమున్ప్రజాపరిపాలనా చీనాయని వ్యవహరింపబడును. ప్రస్తుతము మధ్యచీనాయందలి మూడు రాష్ట్రములు దీని యాధీనమునందుండును. ఆకొగా యీప్రభుత్వము పెకింగుయందలి తాత్కాలిక ప్రభుత్వమునందు చేరవచ్చును.

## "కాంగ్రెసు" పదము ఉపయోగించవచ్చును

(గోలకొండ విలేఖరి)

బెంగుళూరు, మార్చి ౨౯

మైసూరు సంస్థాన కాంగ్రెసు సంఘాధ్యక్షులగు శ్రీ టి. సిద్ధలింగయ్యగారు గాంధీసేవా సంఘ మహాసభయందు పాల్గొనుటకు దెంచిన గాంధిమహాత్మునితో కాంగ్రెసు సంబంధమున సంప్రదించుటకు బర్డోలి వెళ్ళియుండిరి. మహాత్మునిదర్శనము టి. సిద్ధలింగయ్య గారికి ౨౬ తేది యుదయమున లభించినది. హరిపుర మహాసభ తీర్మానానుసారము అఖిలభారత కాంగ్రెసుసంఘమునకుసంస్థాన కాంగ్రెసుసంఘము సంబంధమెట్లుండవలెనను విషయము మహాత్మునితో విచారించినటులను, మైసూరుసంస్థాన కాంగ్రెసు సంఘమునకు "కాంగ్రెసు" పదముపయోగించుట వ్యతిరిక్తమా యని విచారించ మహాత్ముడాపద ముపయోగించిన యెట్టి అభ్యంతరము లేదని తెలిపినటుల తెలియుచున్నది.

### రాజకీయ విచారణ సంఘము

ప్రభుత్వముచే ఇటీవల మైసూరు రాజకీయ వ్యవహారముల విషయములో నిర్ణయించిన విచారణ సంఘమునందు (కాంగ్రెసుసభ్యులు) మైసూరు శాసనసభ్యులగు డి.యస్. మల్లప్పగారిని సభ్యులుగా యేర్పరచినటుల తెలుప బడిన విషయము మైసూరు సంస్థాన కాంగ్రెసు సంఘమునకు తెలుపబడునవియు, వారి నిర్ణయప్రకారము అంగీకార మనంగీకారములు తెలుపబడునని మల్లప్పగారు ప్రభుత్వమువారికి విశదపరచెను.

### జిల్లాబోర్డు భవనము పై జాతీయ పతాకము

౨౬-మార్చి సాయంకాలము జిల్లా బోర్డు భవనము పై తమిళనాడు కాంగ్రెసు సంఘ అధ్యక్షులగు ముత్తురంగ మొదలియారు గారు జాతీయ పతాకారోహణము జరిపిరి. మొదలియారుగా రుత్సవము పలువురు జాతీయపతాక ప్రాముఖ్యత విశదపరచిరి. తర్వాత మహాత్ముని ఛాయాపటము బహిరంగపరచ బడెను.

## అబిసినియామీద ఇటలీఆధిపత్యము

### బెల్జియంఅంగీకరించుట

రోము, మార్చి ౩౦

బెల్జియందేశము యొక్క ఇటలీ రాజకీయ ప్రతినిధి నేడు "ఇటలీ రాజు మరియు అబిసీనియా చక్రవర్తి" అయినవారికి తమ అధికారపత్రమును చూపింపనపుడు బెల్జియందేశము అబిసీనియాపై ఇటలీ ఆధిపత్యము నంగీకరించినదని తెలిపిరి.

## నూతన రెవెన్యూ కార్యదర్శి

(గోలకొండ విలేఖరి)

మదరాసు, మార్చి ౩౦

మ. ఘ. వ. నిజాంప్రభుత్వమందలి రెవెన్యూ శాఖామాత్యులగు సర్. టి. జె. టాస్కరుగారు సెలవుపై యింగ్లాండునకేగుటచే వారి స్థానమున ఆర్. ఎం. క్రాస్ట్వైట్ గారు తాత్కాలికముగా నియోజించబడుటచే వీరి స్థానమున మదరాసు ప్రభుత్వమందలి ఎ. డి. క్రోమ్బి యనునొక ఐ. సి. యస్. యుద్యోగి తాత్కాలికముగా నియమింపబడిరి.

## ౧౯ మందికి ఉరిశిక్ష

మాస్కో మార్చి౩౯

౧౯మంది సోవియట్ నాయకులు కొజఖాస్థానా రష్యాసోవియటు యూనియనునుండి విడదీసి విదేశీయుల రక్షణక్రిందికి తెచ్చుటకు ప్రయత్నించిరను నేరమున పై సైనికాధికారులచే విచారణచేయబడిరి. నేరస్థులు తాము నేరము చేసినట్లు సైనిక న్యాయస్థానమందు అంగీకరించిరి. అందువారికి ఉరిశిక్షవిధింపబడెను. వారలు నేడు ఉరితీయబడినట్లు ప్రకటించబడినది.

విచారణ రహస్యముగా జరిగెను. నేరస్థులలో కొజఖ్ రిపబ్లిక్ యొక్క పూర్వపు అధ్యక్షుడును గలడు. ఒకప్రక్క రాజద్రోహ నేరమునకై ఇటీవల అరెస్టుచేయబడినవారిపిచారణ సివిల్ న్యాయస్థానములో జరుగుచునేయుండ ఈక్రొత్తవిచారణ ఆశ్చర్యము కలిగించుచున్నది.



Printed [illegible] ...krishna Reddy at the Golkonda Power Press Hyderabad, F[illegible]